# సారస్వత గుచ్ఛము

## మడుగులో రారాజు

అంటిపూడి వెంకటరమణ

ఏ రాజన్యుని కన్నుసన్నను సతం
బీక్షించి యుద్ధావనిక్
హాహారాహారి జయేచ్ఛఁబోరి పరవ
శ్యోన్మాశముం గూర్చ శం
ఖారావంబుల శౌర్యగీతికల నా
హ్లాదాబ్ధిఁదేలించి రో
ధీరాగ్రణ్యులు వీరశేఖరులు; ఆ
తేజస్వి నేనాడనే!

మోహానకియ్యాలక్ కుసుమముల్
విరజిమ్మెడు గంధబంధురో
ల్లాసామములోన గాగిలులఁ
దమ్ముఁ జిగించి మనోజ్ఞవాక్సుధా
వాహినులక్ విహారముల
వారిఁగఁ గూర్చి నిలింపసౌఖ్యమీ
మైహికజీవనంబునఁ బ్ర
హర్షముతోఁ జవి చూపు కామినిక్

తృణతుల్యంబుగ వీడివచ్చి రణమే
దివ్యాంగణంబందు శ
స్త్రనికాయంబులె పూవులై, మృతికళ
త్రంబై, పరాఘాత సం
జనితాత్మవ్యథ సౌఖ్యమై, పడిన వి
శ్వాసజ్ఞఁ డొక్కొక్కఁ; డె
వ్వని కాంతామణి కంటి నీటిసెల నా
పై వహ్నిగా మారునో!

పగతురఁ గూల్చి రాజ్యరమ
పాయక నాతోడఁ పైన నిల్చు న
ట్లుగ నొనరింపఁ బంతమిడి
రోషముతోఁ గడుపోరి చచ్చి వీ
నుగ లయిరక్కటా! పుడమి
నోముల పంటలు పోటు బంటులే
సుగతికి పోదురో, ఎటుల
శోకిలకుందురు వీరభామినుల్.

"పరభూపాలురఁ ద్రుంచి వచ్చినయెడ్క్
భాస్వత్పరిష్వంగ సౌ
ఖ్యరణంబందున నిన్ను గూడెదన" టం
చానంద హాసోక్తితోఁ
బురికొల్పక్ పయనించు వీరసుతు ను
ప్పొంగించి పంపించు శౌ
ర్య రమాదేవత లొక్కరొక్కరు మదీ
యాస్థాన వీరాంగనల్.

మాయా దురోదరంబని వి
మర్శలు సేసిన పాండుపుత్రుల
న్యాయరణంబులో దిగి వి
నాశ మొనర్చి రజేయు కర్ణు; నే
సాయములేదు, ఈమడుగు
సాయముఁగూడ విదిర్చి తేతునా—
న్యాయసమీక్ష మబ్బవలె:
నాశము కారె సుయోధనాహతిక్.

కాదు కాదెన్నటికి పోరుకాదు న్యాయ
శాస్త్ర పద్ధతిఁ, బాండవ సరణి మారె;
ధర్మరాజునకే చెడ్డ తలపు కలిగె:
తనువుమనరాదు;—వీరమాతలబుణమ్ముఁ
దీర్పకెట్లు విసర్జింతు దేహమవని.

నాకై పోయిన వీరకేసరుల ప్రా
ణమ్ముల్ లేచిరాలేవు; వ
యోర్కుల్ స్మరియించి పోరఁబడి రా
యిచ్చే శత్రు సంహార; మే
నాకోర్కుల్ ఫలయింపఁజేసి విజయ
వ్యాహార గీతమ్ము నా
భూకాంతల్ వినునట్లు పెల్లబది దే
హం బోద్చు వెన్వెంటనే,

వీరకాంతలు మంగళ వీర గీతు
లైక్యకంఠానఁబాడి, గాజాధిరాజ!
వీర దుర్యోధనా! స్వర్గవీధిఁ బతులఁ
గలియ వత్తుమటంచు సవ్వాలయరారె!

## ఆంధ్రుఁడా?

చింతపూడి శేషగిరిరావుగారు

సూచికా భేద్యతా
గాఢ తిమిరంబులో
కఠిన పాషాణ పం
కిల ఘోర మార్గమున
ఎన్నాళ్లు తిరిగెదవురా?
ఆంధ్రుఁడా!
ఎపుడు స్వాస్థ్యము గాంతురా?

ఈకఠిన శృంఖలా
బద్ధ దేహుండవై
ఆంధ్రత్వమే లేక
ఈదీన దుస్థితి
ఎన్నాళ్లు భరియింతురా!
ఆంధ్రుఁడా!
ఎపుడు ముక్తిని గాంతురా?

రంగదుత్తుంగ త
రంగమాలిక తుంగ
భద్ర యీగుణభద్ర
దీని "ప్రాజెక్టు"కై
ఎన్నాళ్లు తపియింతురా?
ఆంధ్రుఁడా!
ఎపుడు వాంఛితమబ్బురా?

ఆంధ్రీశ్య భాగంబు
ఆరవనాడున కొంత
హైదరబాదున కొంత
కన్నడంబున కొంత
భిన్నభిన్నము అయ్యెరా?
ఆంధ్రుఁడా!
మన్నదే శేషంబురా!

ఆపేరు కీర్తిగ
మహోక వర్ధనుఁడు
ఏకాతపత్రముగ
ఏలుకాలమునందె
స్వాతంత్ర్య రాజ్యంబురా!
ఆంధ్రీంబు
సంపత్సమేతంబురా!

కాకతీయులనాటి
కమ్మ పౌరుషమెల్ల
రెడ్డిరాజులనాటి
దొడ్డ విక్రమమెల్ల
నిముసంబు స్మరియింపురా!
ఆంధ్రుఁడా!
నెమ్మిని పులకింపురా!

కోటవీటులనుండి
ఖడ్గ తిక్కనజోదు
మనుమసిద్ధి ప్రభుని
మనుచు శౌర్యంబెల్ల
నెమదరిగి వీక్షింపురా!
ఆంధ్రుఁడా!
వేడిరక్తము పొంగురా!

రాయర హుతుగంధ
రాచయేనుఁగురేఁగి
ఆరివీర రక్తమున
ఆప్లావనము సేయు
నాటి తేజంబేదిరా!
ఆంధ్రుఁడా!
నేటిదైన్యం బేమిరా?

భాషాప్రయుక్తముగ
భాగింప దేశంబు
దేశీయ సమితియే
కాపించెనే కాద!
దేవుడే వరమిచ్చెరా!
ఆంధ్రుఁడా!
అదారినే పోవరా!

ఆంధ్రరాష్ట్రమటంచు
అబాల వృద్ధంబు
భేరికా డాండడ
డాంకనినదమున
మిన్నంట మ్రోగవలెరా
ఆంధ్రుఁడా!
మున్నంత రేఁగవలెరా!

## కర్షకా! నీభవిష్యత్తు...

బోయినేపల్లి విశ్వనాధరావు

ఎండవేడిమి కాల్పట్ట మండుచున్న
పొలములో వరి పండింప బూనినీవు
కాటవేసి యెడ్లగట్టి పూట పూట
మిక్కుటంబగు నియతిని మించి రేయి
బవలు యనుభేదమును లేక, పరవిచార
మేమియును [illegible]
మన్న ...లువక నిస్పృహా సౌంద్యబుద్ధి
భోగ కాంక్షలులేక విరాగివృత్తి
సకల కష్టములకు నోర్చి సాధువయ్యె
చిత్తమును కల్పు భావి ప్రతివ్యంపవలయు
నెంత్ర మొకపుట్టి కోటిచే ఋణము దెచ్చి
నీవు నీగిత్తలును వాల్గు నెలలు వారు
బోసివప్పటినుండియు పొలముఁబందు
వరకు చేసిన కృషికిని ఫలమునంగ
దైవమొకవేళ నీకు మేల్ దలచునేని
రాళ్లవర్షము చేదుతెగుల్ రానివేని
నికరముగ పెండుపుట్లగు నీకునంత
కోటిబుణముకు కిస్తుకు చెల్లుగాగ
నీకు మిగులదు కన్నీరు నిశ్చటిలగ
బాసటగనీ కుపకరించు పనులవారు
బిచ్చమని కూకలిడియెదు బిచ్చగాండ్రు
అకలికి దురి పిల్లెడు నీ కొడుకులు
హీనమగు పశువులు కడు దీనభార్య
కానరా యీదృశ్యంబు గాంచలేక
యేగతిని నీవు భరియింతో యెరుగరాదు
చెప్పలేవు నీస్థితిక్ విప్పియిట్లు
కర్షకా నీభవిష్యత్తు కష్టమయము.
శేగడి వేలవృద్ధి చెందిన నాణ్యమేమి
శాస్త్రవిజ్ఞాన మధికత నలుపనేమి
జాతికని శక్తులమూలమున చనగనేమి
సర్వమానవ భ్రాతృత్వ చాటనేమి
విద్య నిర్బంధ మొనరింప చోద్యమేమి
కాలవిపరీతమున వర్ష కాలమెల్ల
వానలేక పశువులకైన వారిలేక
నీకు, నీకుటుంబమునకు నీడలేక
తినుటకే రీతిసూర్పగా తెరవులేక
కట్టుకొన గుడ్డలునులేక కడుపుమాడ
నీదుబిడ్డలు గుమిగూడి నిలువనీక
భార్య నొకతట్టు బిట్టుగా బాధపెట్ట
పశువులు పురుగులను రోగాలు పట్టిగుంజె
అప్పువారలు కోర్టుకు త్రిప్పుచుండ
యేగతినినీవు భరియింతో యెరుగరాదు
చెప్పలేవు నీస్థితిక్ విప్పియిట్లు
కర్షకా నీభవిష్యత్తు కష్టమయము.

## వైశ్యమహాసభ వారికి ఒకసూచన

సింగం సత్యనారాయణగుప్త

నిజాంరాష్ట్ర ప్రథమార్యవైశ్య మహాసభతో బాటు మహిళాసభయు సమావేశపరుపబడున ను వార్త సంతోషప్రదమైనది. నేడు, యువక వైశ్యసోదరులలో నూటికి తొంబదితొమ్మది మంది ఆరోగ్యము చెడి, జవసత్వములు క్షీణించి శక్తిహీనులై నానాబాధలుపడుచున్న విషయము తెలిసియేయున్నది. వారి బాధానివారణ గావించుటకు మహాసభవారు ప్రయత్నించవలసియున్నది.

అంగ బలమునకు శరీర వ్యాయామమెంతేని తోడ్పడును. వ్యాయామమనినను, శాలింఖానాలనినను, మన పెద్దలు చీ మనకెందుకోయి, వ్యాపారము చేసుకునేవాండ్లకని యీసడించుకొనెదరు. కాని బలవంతుడు మానభంగము చేయ సమకట్టినపుడు మాత్రము, పోలీసు రానోయి ఆనాడి మహానుభావుల నెందరనో చూచియున్నాను. కావున ప్రతిపట్టణమునందు, ప్రతిపల్లెయందును, ప్రతివీధిలోను, వైశ్య వ్యాయామశాలల నేర్పాటుచేసి యువకసోదరులకు సకలవిధముల ప్రోత్సాహము కలుగజేయుటకు మహాసభవారు పూనుకొనవలెను. తగినంత ప్రోత్సాహము కలిగించి వైశ్యవ్యాయామ పోటీల నేర్పాటుచేసిన గాని మనజాతిసోదరులకు ఉత్సాహాతిశయము కలుగదు. నాయీసూచనను మహాసభవారు అంగీకరించెదరని విశ్వసించుచున్నాను. (ఆంధ్ర పత్రిక)









## గోలకొండ సంవత్సరాదిసంచిక

### (వ్యవసాయక సంచిక)

వ్యాపారకులకును, వ్యాసకర్తలకును, చందాదారులకును తెలుపు కొనుటయేమన మేమీసంవత్సరము గతించిన మూడు సంవత్సరములందువలె యీసంవత్సరము తీపనెల ఆదిలో మాపత్రికయొక్క సంవత్సరాదిసంచిక ప్రకటించుచున్నాము. అయితే యీసంచికలో కేవలము వ్యవసాయమును గురించి మాత్రమే వ్యాసములు ప్రకటింపబడును. వ్యాసకర్తలు ఇతరవిషయములుపంపు శ్రమకుపోకుందురుగాక. పద్యములుకూడ ఎవరైన పంపిన వ్యవసాయమునకు సంబంధించినవిగా నుండిననేగాని ప్రకటింపబడవు. పాటలుకూడ వ్యవసాయ సంబంధములే పంపవలెను. సేద్యముచేయువారు, సేద్యముకూలీలు కలుపుతీయునప్పుడు, కోతలప్పుడు, కల్లముచేయునప్పుడు, మోటకొట్టునప్పుడు పాడునట్టి పాటలలో వ్యవసాయసంబంధమువి ఉండిన సేకరించిపంపిన ప్రకటింపబడును. రైతులకును, వారి కృషికిని సంబంధించిన సామెతలుకూడ కూర్చువారు కూర్చిపంపగలరు.

వ్యవసాయ సంబంధములో వ్రాయదగిన కొన్నివ్యాసములను సూచించుచున్నాము.

౧ మన మాల్గుజారీ చరిత్ర, ౨. మనమాల్గుజారీ పద్ధతికిని, బ్రిటిషుఇండియా పద్ధతికిని భేదము, ౩. బావిక్రింది సేద్యము, ౪. పారకము క్రిందిసేద్యము, ఇక్కడమరి బ్రిటిషిండియాలో, ౫. గ్రామ పునర్నిర్మాణము, ౬. గ్రామ పంచాయతీలు, ౭. జాగీర్లలోని మాల్గుజారీపద్ధతి, ౮. బందోబస్తు అయిన జాగీర్లు కానిజాగీర్లు—అందలిరైతుల స్థితిగతులు. ౯. పట్టాభూములలోని చెట్లపై రైతుల కధికారమెంత—బ్రిటిషిండియాలో నెట్టిపద్ధతికలదు, ౧౦. అడవులు, అటవీశాఖాచరిత్ర, అడవులవలన రైతుల కేమేమి యిబ్బందులు, ౧౧. లోకల్ ఫండు—అదెట్లు వినియోగమగుచున్నది, బ్రిటిషిండియాలో లోకల్ బోర్డుల పద్ధతి, ౧౨. తెలంగానా భూముల పన్నులు, (ఖుష్కి-తరీ), ౧౩. తోటలు, కూరగాయలపెంపకము, ౧౪. రైతులకు సహాయపడు పరిశ్రమలు. (౧) కోళ్లపెంపకము, (౨) తేనెటీగలపెంపకము, (౩) పడకులు—నేయుట, (౪) త్రాళ్లు—వేయుట, ౧౫. పంటల అభివృద్ధి, ౧౬. పశువుల వృద్ధి, వాటినిపెంచుట. వాటిరోగ చికిత్సలు, ౧౭. తెలంగానాలోని సేద్యమందలి లోపములు, అవి పోగొట్టుటెట్లు? ౧౮. రైతులఅప్పు, దాని విమోచనవెట్లు, ౧౯. ఋణనివారణచట్టము, దానిఫలితము.

ఇవి కొన్ని నమూనాగా చూపబడినవి. వ్యాసకర్తలు ఈవిషయములందు శ్రద్ధతీసికొని తమ అమూల్యాభిప్రాయములను వ్రాసిపంప ప్రార్థితులు. వకీళ్లు అయినవారు మాల్గుజారీ ఖానూనుబట్టి గష్తీలనుబట్టి రైతుల కేమార్పు అవసరమో సూచింతురని మనవి.

వ్యాసములన్నియు మాకార్యాలయమున కిప్పటినుండియే పంపగలరు. నేటినుండి ఫర్వర్ది ఆఖరులోగా మాకు పంపవలెను.

సంపాదకుడు

# ప్రకటన

నైజాము రైల్వేకు సంబంధించిన యీక్రింద సెక్షనులలో రాలిన మసి బొగ్గు (బూడిద)పాలీనా కాంట్రాక్టు 1-2-38 మొదలు ౩1-1-39 వ సం॥రము వరకు కొనగోరువారి టెండర్లు కావలసియున్నవి:—

1. సికింద్రాబాదు—వాడి
   సికింద్రాబాదు, లింగంపల్లి, మరియు వాడి స్టేషనులు మినహా యితర స్టేషనులు.
2. సికింద్రాబాదు—ఖాజీపేట
   సికింద్రాబాదు, లాలాగూడ, భువనగిరి, ఘటకేశ్వరము, బీబీనగరము, మరియు ఖాజీపేట స్టేషనులు మినహా యితర స్టేషనులు.
3. సికింద్రాబాదు—పూర్ణ
   సికింద్రాబాదు, పూర్ణ స్టేషనులు మినహా యితర స్టేషనులు.
4. సికింద్రాబాదు—ద్రోణాచలము
   సికింద్రాబాదు స్టేషన్‌తప్ప యితర స్టేషనులు.

టెండర్లు నాలుగు సెక్షనులకు యుండవలయును గాని విడి సెక్షనులకు యుండగూడదు.

సీల్డు టెండర్లు నైజాము రైల్వే లోకో అండు క్యారేజి సూపరెన్‌టెండెంటు ఆఫీసు లాలాగూడ 4వ ఫిబ్రవరీ 1938 సం॥రము మధ్యాహ్నము లోగా యీక్రింద దస్కతుచేసిన వారి పేరన దాఖలు చేయవలెను.

ఇందుకు సంబంధించిన షరతులు పై చెప్పిన ఆఫీసులో తెలుపబడును.

రైల్వే ఎక్కువ టెండరుగాని ఏటెండరు అయినను ఒప్పుకొనుటకు బాధ్యత కాదు.

యఫ్. యి. హాఫ్

లోకో అండు క్యారేజి సూపరెన్‌టెండెంటు.

# గోష్ఠీ ప్రచురణములు

## ఆంధ్రరత్న గోపాలకృష్ణుని రచనలు

కీ॥ శే॥ శ్రీ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణ స్థాపిత. శ్రీసదాంధ్ర విద్యాపీఠ గోష్ఠివారిచే ప్రచురించబడిన యీక్రింది పుస్తకములు అమ్మకముకు సిద్ధముగనున్నవి. వెలయువారీ దిగువస్థలమునకు వ్రాసి తెలుసుకొనవచ్చును.

ఆంధ్ర రత్న రచనలు

| | | | |
|---|---|---|---|
| ౧. గోపాలకృష్ణుని చాటువులు | (40 పుటలు) | వెల | రు 0-2-0 |
| ౨. ,, పురుషార్థములు | (122 పుటలు) | ,, | రు 0-8-0 |
| 3. ,, శ్రీరామదండు | (31 పుటలు) | ,, | రు 0-0-3 |

విధానము

కుమ్మిడిదల వేంకట సుబ్బారావుగారి రచనలు.

| | |
|---|---|
| ౧. ఆంధ్రరత్న గోపాలకృష్ణుని జీవిత చరిత్ర —సందేశము (ఇంగ్లీషు 386 పుటలు—చక్కని బొమ్మలు దళసరికాగితము—మేలు బైండు | రు 5-0-0 |
| ౨. గోష్ఠి (ఇంగ్లీషు) పాతప్రతులు 1 కి | 2-0-0 |
| 3 ,, (తెలుగు) ,, ,, | 1-0-0 |

దొరకు స్థలములు.

౧. గోష్ఠీ ప్రచురణాలయము,
సత్యనారాయణ పురం, బెజవాడ.

౨. గులాం దస్తగీర్ బుక్కు సెల్లర్,
ఆబిద్ రోడ్డు హైద్రాబాదు.
(వికాజి యెదురుగ)

# Volo-Pep వోలోపెప్

## ఒక అద్భుతమైన ఆంగ్లేయ ప్రకాశకము

మోటారు యజమానులు, బస్సుసర్వీసు వారు ప్రపంచమంతటనువోలోపెప్‌ను వాడుచున్నారు. ఏలయనగా అది యింజనును కార్బొనైజ్‌చేసి అందలిసామానును గ్రాఫైట్‌తో నిర్భేధ్యములగా చేసి ప్రాతమోటారునుగూడ క్రొత్తదిగా చేయును.

వోలోపెప్ వాడుకవలన పెట్రోలుఖర్చు ప్రతిశతి 25 వంతులుతగ్గును. ప్రపంచమందలి మోటారుయజమానులు ఎసోసియేషన్లు దీనిని సర్టిఫై చేసినవి. ప్రయాణపత్రములు పెద్ద పెట్రోలు దుకాణములలో దొరకును. 12 బిళ్లలుగల ఒకడబ్బి బి.జి. -/8/- 65 బిళ్లలడబ్బి బి.జి రు 2/- ఒకగ్యాలన్ పెట్రోలులో 1,2 బిళ్లలు గొప్పమార్పును గలిగించును.

వోలోపెప్ కంపెనీ ఆఫ్ యిండియా

హైద్రాబాదు—దక్కన్.

## జాగ్రతగల ప్రయాణికుడు బాధ్యతనువహించడు

ప్రయాణముచేయునప్పుడు రొక్కమును వెంటనుంచుకొనుట బాధాకరమును అపాయకరమును నైయున్నది. నిర్విచారముగా ప్రయాణము చేయదలచి నయెడల

సెంట్రల్‌బ్యాంకుయొక్క

ట్రావెలర్సు చెక్కులను ఉపయోగింపుడు

అవి:—

1. నష్టముకలుగకుండ కాపాడును
2. రొక్కమునకంటె సులభముగా తీసికొనపోవచ్చును.
3. 25,50 100 రూపాయిలు మొత్తములలో దొరకును.
4. హైద్రాబాదులోను ముఖ్యమైన బ్రాంచీలలోను దొరకును. వీ బ్రాంచిలో నైనను తో చేయబడు చెల్లును.




# ఆత్మ సంరక్షణ వుపాయము

## నగరవాసుల సైనిక శిక్షణ

కలకత్తా, జన ౨౯

నిన్న సాయంకాలము జరిగిన కలకత్తా పురపాలకసంఘ సమావేశమునందీ క్రింది విధముగు తీర్మానము అంగీకరింపబడినది:—

"కలకత్తావంటి నగరమునందు శత్రువుల దాడిమూలమున నగరవాసుల సంరక్షించుటకు ౨౦ సం॥ నుండి ౪౦ సం॥ల ప్రాయముగల నగరవాసులకు, పన్ను చెల్లించు వారలకు ప్రతిసంవత్సరము మూడు మాసములైనను సంపూర్ణముగు సైనికశిక్ష యొసగుటకై, ప్రభుత్వము యీ సంఘము వారు భారత ప్రభుత్వమువారికి తెలుపుచున్నారు"

ఈ తీర్మానమునకు ప్రతికూలముగా నుండిన యూరోపియను సభ్యులు వోటు సమవాయమున తటస్థులుగా నుండిరి.

"ఇది కేవలము నగరమును, నగరవాసులను శత్రువుల వైమానిక ముట్టడినుండి కాపాడుటకైకాదు. ఆధునిక ఆత్మసంరక్షణ మార్గములను నగరవాసులకు బోధించుట మనకర్తవ్యము. దానికవసరమగు శిక్షణ యొసగవలయును. ప్రభుత్వము వివేకముగా తన బాధ్యత నిర్వహించబూనిన తక్షణమే యీ తీర్మానమును కార్యరణభాగ్యము కలిగించితీరును. ఒకవేళ ప్రభుత్వ మీ విషయమును గమనించదలచకున్న భారతవర్షమునకేగాదు గ్రేటు బ్రిటనుకు సహితము ముప్పుకలుగుననుట నిశ్చయము" అని పురపాలక సంఘమునకు ఆల్డర్‌మ్యాన్‌లగు శ్రీ సుభాష్చంద్రబోసుగారు తీర్మానమును బలపరచుచు నుడివిరి.

# మైసూరు లెజిస్లేటివు కౌన్సిలు సమావేశము

క్రొత్త చిత్తుశాసనముల గూర్చి ఆలోచన

బెంగుళూరు (మెయిలు)

మైసూరు లెజిస్లేటివుకౌన్సిలు గత సోమవారము సమావేశమయ్యెను. ఆనాడు ౧౦ చిన్న చిత్తుశాసనము లాలోచింపబడెను. అందొకదాని యందు మైసూరు సంస్థానమునకు వచ్చిరాగుకొనియుండు ఖైదీలను ఆతదేశ రాష్ట్రమువారికో అరాష్ట్రము యొక్క ప్రభుత్వమువారు కోరినచో అప్పగించుటకు ఏర్పాటు చేయబడినది

మంగళవారము నాటి సమావేశమందు శాసనసభవారు నాలుగు ముఖ్యములైన చిత్తుశాసనములనుగూర్చి ఆలోచించి వాటిని సెలెక్టుకమిటీ (ఉపసంఘ) విచారణకు అప్పగించిరి.

అందు మొదటిది ఒకమతస్థులు ఇంకొక మతములో చేరునపుడు వారలకు ప్రాతఆస్తి మున్నగువాటిపైగల అధికారము పోకుండ చేయుటకై ఉద్దేశింపబడినది. చిత్తుచట్టమును హిందూమహమ్మదీయులగు సభ్యులు ప్రతిఘటించిరి. ఇంకొక చిత్తుశాసనము సివిల్ ప్రాసీజరు కోడులో ప్రభుత్వోద్యోగస్థులు, రైల్వేఉద్యోగస్థులు, స్థానికసంస్థల ఉద్యోగస్థులు— వీరలజీతములలో డిక్రీలకిపుడ పట్టుకొనదగిన మొత్తమును నెల ౧కి రు ౨౦౦ల జీతము వారిలకేగాక ౩౦౦ రూ జీతమువరకుకూడ అన్వయించునట్లు చేయబడినది. ఈ చిత్తుశాసనమును మొకటి సనతనులగు సభ్యులు ప్రతిఘటించిరి.

మూడవది భీమావ్యాపారమునకు సంబంధించినది. మైసూరు సంస్థానమందు భీమావ్యాపారము సాగించదలచినచో దేశీయకంపెనీలు రూ ౫౦౦౦౦ లును విదేశీకంపెనీలు రూ ౨ లక్షలును డిపాజిట్టు ప్రభుత్వసమ్మతము లగు సెక్యూరిటీలలో కట్టవలెనని ఈచిత్తుచట్టము నిబంధించుచున్నది.

నాల్గవది ఒకధికారసభ్యునిచే ప్రతిపాదితమైనది. దీనిచే హిందూ వితంతువుల వివాహములు శాసనసమ్మతములగ చేయబడి వితంతు వివాహములు కొనసప్పుడు, ఆ స్త్రీలకెట్టిహక్కులు, అధికారములు, ఉండునో ఆహక్కులు, అధికారములు ఉండునట్లు చేయుచున్నది.

# ఫ్రాన్సుప్రాంతముపై బాంబులు

లండన్ జన ౨౯

౧౫ జపాను విమానములు హాంకోనగరమును ముట్టడించెను. బాంబులు విసరివవి.

సూచౌ, హాంఘాయిమధ్యజరిగిన యుద్ధమునందు మృతిజెందిన ౨౫ జపాను శరీరములు లారీ ద్వారా తేచెను

ఫ్రెంచి ... జపానువారు బాంబు విసరుటవలన అపాయము కలిగినట్లు ఫ్రాన్సు ప్రతినిధి తెలుపుచున్నాడు.

# ౧౭౪౭—౧౮౫౫ ల మధ్య మహారాష్ట్ర నిజాముల సంబంధములు

బొంబాయి ప్రభుత్వమువారు "పేష్వా దఫ్తరమునుండి ఏర్చి తీయబడిన భాగములు" అను పేర ప్రకటించిన కొన్ని మరాఠీ మాలలోని ౪౦ గ్రంథములకు అనుబంధముగా పూనా రెసిడెన్సీ రికార్డులను ప్రకటించుటకు పూనుకొని అందు ఇదివరకు రికార్డులను ప్రకటించియుండిరి. ఇపుడు నాలుగవదానిని ప్రకటించినారు. దీనిపేరు "౧౭౪౨—౧౮౫౫ సంవత్సరములమధ్య మహారాష్ట్రులకును నిజామునకును గల సంబంధములు" అని పెట్టబడినది. ఈప్రచురణమును గూర్చి బొంబాయి ప్రభుత్వ ప్రకటనకాధికారి ఇట్లు వ్రాసినాడు.

"ఈసంచికలోముద్రించిన పత్రములు క్రొత్తగా మొదటిసారి ఆంగ్లో — భారతీయచరిత్రయొక్క క్రొత్తస్వరూపమును చూపుచున్నవి. ఇంతవరకును ఆర్కా యుద్ధ సమాచారములు భారతదేశమందు బ్రిటిషు ఆధికారముయొక్క ఉదయాభివృద్ధి చరిత్రయొక్క ప్రధానప్రవాహమును బాధించని అవాంతర సమాచారములుగా భావించబడియుండెను. అవి మహారాష్ట్రులకును నిజాంగారికిని సంబంధించినదిమాత్రమే యనియు, అందులో ఆంగ్లేయులు ఎట్టి ప్రమేయము గాని లేని ఇరుగుపొరుగువారుగను ప్రేక్షకులుగను మాత్రమే యుండిరనియు భావించుచున్నారు. ఇపుడు ప్రకటించబడిన పూనా హైదరాబాదు రెసిడెన్సీలమధ్య ఉత్తరప్రత్యుత్తరములు అసమాచారమునకు క్రొత్తరంగు నిచ్చుచున్నవి. దానివలన ఆసమాచారము భారతదేశమందు ముఖ్యములైన ఆధికారములగు ఇంగ్లీషువారికిని, మహారాష్ట్రులకును, నిజాంగారికిని మధ్య రాజకీయముగ జరిగిన కుట్రల ఫలితముగ కనబడుచున్నది. ఈప్రచురణమందు ౧౭౪౨ మొదలుకొని ౧౭౯౫ వరకు చాల కష్టములతోనిండిన ఆమూడు సంవత్సరములలో జరిగిన ఉత్తరప్రత్యుత్తరములు గలవు. ప్రారంభమున ౧౭౯౧—౯౨ యుద్ధఫలితముగ శత్రువులు టిప్పుసుల్తాను నోడించుట వర్ణించబడినది. ఆ యుద్ధముతర్వాతగూడ టిప్పు భావ్యుప్రద్రవ బీజముగనుండినను యుద్ధము దెబ్బ అతనిని ఇతరులతో సంబంధము లేనివానినిగను ఒంటివానినిగను చేసెను. ప్రచురణముయొక్క ఆఖరున ఖర్దావద్ద నిజాము అపజయము వర్ణితమైనది.

ఈ సంపుటములో ముద్రించబడిన పత్రములను జాగ్రతగ పరిశీలించినచో, గవర్నరు జనరలు సర్ జాన్‌షోరు అవలంబించిన తాటస్థ్య విధానము అప్రయోజకమైనదని తరువాతి చరిత్రకారులు చూపినదోషమును తుడిచివేయుటకు నమ్మకము కలిగించుకారణములు లభించునని ఈసంపుటము క్క సంపాదకుని అభిప్రాయమైయున్నది. సర్ జాన్‌షోర్‌గారు ఈవిషయమునకుసంబంధించిన రాజకీయము తెలిసికొనవలెనని పూనా, హైదరాబాదు ఆస్థానములవద్దనుండు రెసిడెంటులు సూచించిన భిన్నమార్గముల ఫలితము లెట్లుండవచ్చునను విషయమును, యూరోపాలో పరిస్థితిని జాగ్రతగా ఆలోచించుకొనియే తటస్థులుగ నుండుటకు తీర్మానించుకొనిరని చెప్పబడినది

౧౮ వ శతాబ్దిలో నంతయు మహారాష్ట్రుల విధానముయొక్క ముఖ్యోద్దేశములు ఉత్తరము వైపునకును, తూర్పువైపునకు, దక్షిణమువైపునకును తమరాజ్యమును వ్యాపింపజేసికొనుట. మొదటిప్రయత్నమువలన వారలకు ఉత్తరమందలి రాజ్యములతో సంఘర్షణ కలిగెను. రెండవదానిలో మహారాష్ట్రులకును నిజాంగారికిని సంఘర్షణకు కారణమున్నది మూడవప్రయత్నములో వారలు ముందుకు సాగకుండ హైదరలీ టిప్పుసుల్తానుల ఉదయముచే భగ్నపరచబడెను. రెండవ ప్రయత్నములో కడపటిసంగతి ఈసంపుటమందు ముద్రితమైన ఉత్తరప్రత్యుత్తరముల యందలి విషయమైయున్నది.

ఈపుస్తకమువెల కల్దారు రూ ౪ లు.

# స్వాతంత్ర్య దినోత్సవము

(గోలకొండ విలేఖరి)

మచిలీపట్టణము జనవరి ౨౭

రామలింగేశ్వరస్వామి యాలయమున పట్టణ కాంగ్రెసు సంఘము వారిచే స్వాతంత్ర్య దినము జరుపబడెను. సాయంత్రము ౪గం గంటలకు పట్టణ కాంగ్రెస్ సంఘ ఆఫీసునుండి ఒకటులుదేరి త్రివర్ణ పతాకముతోను, జాతీయ గీతములు పాడుచు నగరమంతయు ఊరేగింపు యుత్సవము జరిపిరి. పురప్రముఖులు అనేకులు కాంగ్రెస్ పుట్టినదాది యిప్పటివరకును దేశమునకు గావించినసేవను, స్వాతంత్ర్య దినము జరుగుటయందుగల అర్థమును విపులముగా చెప్పిరి. ఆపంచరము భాస్కర్ల కృష్ణమూర్తిగారు స్వాతంత్ర్య ప్రమాణమును చదివిరి వందనముతో సభ ముగిసెను.

# అబిసీనియాలో ఘోరయుద్ధము

౧౫ అధికారుల హత్య

లండన్ జన ౨౭

అబిసీనియానుండి అందుచుచున్న వార్తలవలన ఉత్తర, పశ్చిమోత్తర ప్రాంతములందు తీవ్రయుద్ధము జరుగుచున్నటు అబిసీనియా ప్రతినిధి కార్యాలయమువారు ప్రకటించుచున్నారు. కోల్పోయిన ప్రాంతములను తిరిగి ఆక్రమించుకొనుటకు యిటలీ మోటారు, వైమానికవర్గములు తీవ్రముగా ప్రయత్నించుచున్నను వారి విజయముమాత్రము తాత్కాలికముగనే యుండుచున్నది. ఆక్రమించుకొనిన ప్రదేశము లసిరి మరుజాటివరకపాయముగా మారుచున్నది.

ఇరిట్రియా సైనికులలో ౩ వర్గములవారు తిరుగుబాటుచేయుటచే ౨౦ మంది యిటలీ సైనికాధికారులు, ౫౮౮౩ యిటలీ సైనికులు మరణించిరి. అబిసీనియా ప్రజలకిటులనే నష్టము కలిగినటులగలదు

అబిసీనియావారు ౪౩ లారీలు, అనేక రైఫల్సు, మరఫిరంగులు, గందుసామాను ఆక్రమించుకొనిరి. ఇటలీవారుకొందరు నియమములకు వ్యతిరిక్తముగా ప్రవర్తించుటవలన గోజామ్ రాష్ట్రమునందు ౧౫ అధికారులు హత్యగావింపబడిరి. దీని ప్రతిఫలము గాంచుటకు ౪౦ విమానములు ఆదీసు అబాబాపై పోవుచు ప్రజలపై బాంబుల విసరుచున్నారు. అనేకరాష్ట్రములు అబిసీనియావారి కాధీనమైనటుల గలదు.

# గ్రీసులో నియంతృత్వము నాయకుల అరెస్టులు

వయీనా, జన ౨౦

జనరల్ మెటాక్సాస్ నియంతగా ప్రకటింపబడినటుల రయిటర్సువార్తలు విశదపరచుచున్నవి: కొన్ని రోజులకు పూర్వము ప్రభుత్వప్రతికూల నాయకులు ప్రజలు తమసత్వము లను చక్రవర్తినుండి బయటకుదొబ్బింపుచు ప్రభుత్వమువారవలంబించిన పద్ధతులను ఆక్షేపించుచు ప్రకటనగావించిరి. మెటాక్సాస్ ప్రభుత్వము చడిచప్పుడులేకుండ పార్లమెంటుసభ్యుల అరెస్టుచేయించుచు దూరదూరపు దీవులకు పంపుచున్నది.

లిబరల్ నాయకులగు ఎం. సోఫులిస్,తురాక్విస్ జాతీయపక్షపునాయకులగు ఎం., థియోటకిస్, అభివృద్ధిపక్ష ముఖ్యులగు కఫాన్డరిస్,స్వతంత్ర ప్రజాసత్తపక్ష నాయకులగు మిక్లోకొంపుకిస్ ప్రవాసశిక్షకు గురియైనవారలలో ముఖ్యులు

# టోక్యోలో స్వాతంత్ర దినోత్సవము

టోక్యో జన ౨౭

కాంగ్రెసువారి ఆదేశానుసారము టోక్యో నగరమునందు భారతీయులందరు శ్రీ రాస్‌బెహారీబోసు గారి ఆధిపత్యమున స్వాతంత్ర్య దినోత్సవ మతివైభవముగా జరిపిరి.

# వుహూసమీపంలో తీవ్రసమరము

షాంఘాయి, జన ౨౮

వుహూసమీపమందలి కొండవద్ద చీనాజపాను సైనికులకు తీవ్రసమరము జరుగుచున్నది. ఉభయులు బ్రతుకుటయో చావటయో నిర్ణయించుకొనునటుల గలదు: జపాను సైనికులసహాయార్థము ౧౦ వేల జపానుసైనికు లరుదెంచిరి. జపాను యుద్ధనావలు చీనావారి ప్రదేశముపైన వేల బాంబుల విసరినవి. చీనావారి తీవ్రసమరోత్సాహమువలన జపానువారి కపాయస్థితి యేర్పడినది. ట్సీనింగు ఆక్రమించుకొనుటకు జరిగిన చీనావారి ప్రయత్నములు ఫలవంతముగా గలవు. నూష్యూవద్ద ౨ లక్షల చీనా సైనికులు గలరు

# నాన్కింగుపై చీనావారి దాడి

షాంఘాయి జన ౨౮

చీనా విమానములు నాన్కింగ్ నగరమును ముట్టడించినటుల, బాంబువర్షమువలన పెట్రోలు ట్యాంకు ధ్వంసమైనటుల జపాను వార్తలు తెలుపుచున్నవి.

# బాంబుల వర్షము

ప్యారిస్, జన ౨౯

స్పెయిన్ ప్రభుత్వ విమానములు టెరూయెల్లు (యేత్రిడ్ ఉత్తరమున గలదు)పై ౩౦ బాంబులు విసరిరి కొన్ని బాంబులు ఆవాఛాత్రిమును పైపడుటచే సర్వ ధ్వంసమైనది. ౧౨ సరు మరణించిరి. అనేకులు గాయపడిరి.

# ౧౨౫ మంది మరణము

వెలెన్సియా జన ౨౯

విప్లవకారులు విమానములనుండి నగరముపై బాంబులు విసరుటవలన ౧౨౫ మంది మరణించిరి, ౨౦౮ రు గాయపడిరి. వీనివలన బ్రిటీషు వారి కాన్సలు కచేరి యొకటి ధ్వంసమైనది

# చీనావారికి సోవియేటు సామగ్రి

పెకింగ్, జన ౨౯

సోవియేటువారు చీనావారికి వలయుసామగ్రి నంతయు వందచేయుచున్నారు. వీనియందు యుద్ధనావలు, విమానములు విరివిగా గలవు. చీనా, రష్యాకు రాకపోకల సౌకర్యమేర్పరచుటకు లెన్కియాంగ్ మండిగల రహదారి పనిచే యబడుచున్నది.

# గోలకొండపత్రిక విడిప్రతుల విక్రయ కేంద్రములు

హైద్రాబాద

1. గణపతిభవన్, ఆబిదురోడు.
2. గులాందస్తగీర్ బుక్సెల్లర్స్, వికాజిహోటల్.
3. భారతీ వస్తుభాండార్, సుల్తాన్‌బజారు, చావుడి.
4. ఆంధ్రశ్రీకంపెని, రాంకోటు.

సికింద్రాబాద

1. ఇ. నర్సింలు, న్యూస్ యేజెంటు, 108 జేమ్సుస్ట్రీటు. —చీఫ్ ఏజంటు.
2. శ్రీరామా బుక్‌డిపో మార్కెట్టుస్ట్రీటు.






గోలకొండపత్రిక

(జాతీయ అర్ధవారపత్రిక)

హైద్రాబాద

చందా వివరములు

సంవత్సరముునకు రు ౬లు

అర్ధసంవత్సరమునకు రు ౩లు

విడిప్రతి ౧ అణా

The only Leading National *Bi-weekly* of the Andhra Provinces.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

GOLKONDA The only out-standing effective medium for the ventilation of views and grievances of 70,00,000 Andhras of the Premier State

*Volume* 12 | HYDERABAD - DECCAN | *Number* 76

**Thursday 3 rd Fedruary 1938**

## నాటకములు—రచన.

(శ్రీ రామారాయవర్మ
(ఆంధ్ర నాట్యకళామండలి)

ప్రస్తుతం అనేకమంది నవీనభావాల్తో రచయితలుగా తయారవుతూన్నారు. కొన్ని కొన్ని రచనలు ప్రజాదరణపొందటంకూడా జరుగుతుంది. కాని ఈ ప్రజాదరణపొందిన రచనలే పండితాదరణ పొందటంలేదు. ఇందుకు కారణాలేమేనా ఉండవచ్చు. కారణాలతో కాగితం నలుపుచేయటం ఇష్టంలేదు. ప్రస్తుతం చర్చించవలసింది వాటిలో ఉండే నవీనత్వం. కాని ముందు నవీనానికి ప్రాచీనానికి ఉండే వ్యత్యాసాన్ని నిర్ణయించాలి. ఇందుకు ఉదాహరణం— పోతరాజు భాగవతం. ఇది ప్రాచీనం. కాని భాగవతంలోంచి కృష్ణుని బాల్య ఘట్టం ఎత్తుకొని ఒక నాటకంగా పెంచి వ్రాయటం కొంతవరకు నవీనత్వం అవాలి. దీనివల్ల పోతరాజుకు, అల్లా మార్పులతో నాటకంగా రచించిన రచయితకూ కీర్తి ఉంటుంది. దీన్నే పది రకాలుగా నాటకాలు తయారుచేస్తే నవీనత్వం అందులోఉందనటం కూడదు. అనుమానం లేకుండా అల్లాంటిరచనలను అనుకరణాలలో చేర్చవచ్చు. ఇందుమిందు నేటినవీనత్వం అతిథ లేఉంది. ఇది పేరుకుమాత్రం నవీనాలేకాని భావాల్లోమాత్రం పురాతనం.

నూటికి పదినాటకాలు మినహాయించి మిగతనాటని పరిశీలిస్తే ఒకదానికొకటి కొంతకొంత మార్పులతో అమ్రకాప్పీ భావాలుకూడా వెంటచేస్తే ఏవగింపనిపిస్తయి. ముఖ్యంగా ఈరచయితలు ఎత్తుకునే కథాఘట్టం ఒకటే. వృద్ధునికి పసిపిల్లనిచ్చి పెళ్లిచేయటం, వివాహనిషాహం కన్యాశుల్కం—ంలో ప్రేమ: వేశ్యలవల్ల, త్రాగుడువల్ల పాడుకావటం. ఇల్లాంటివిషయాలు ఎంచుతూన్నారు. పదిమందీ ఒకేరకం వ్రాసినా వేరొకవిధంగా మంచిదే దోషరహితంగా ఉంటేను. సారస్వతంలో ఉండేమహత్తు చాలాగొప్పది. అది పిల్లవాడి చేతిలో కత్తివంటిదని నా అభిప్రాయం. కుడ చెత్తనాపకు రచయితకూడా ఏదోవిషయం ఎత్తుకొని నీతిని బోధపరుద్దాం అనేఉద్దేశంతో మొదలుపెడతాడు విషయము, నీతి, రచన— ఈమూడు సక్రమరీతిని రచయితఉండేలా చూస్తేనే రచయిత తనఉద్దేశంలో కృతకృత్యుడవుతాడు. అంటే ప్రేక్షకబృందం నీతిని స్వీకరించినట్లు. అల్లా ఉండనప్పుడు రచయిత ప్రజలకునీతిని ప్రబోధించుటకు వ్రాసినరచన అవినీతిని నేర్పుకుంది. పెద్దఅబ్బినట్లు మంచి అబ్బదని ఓసామెత. ఇదే సారస్వతంలో ఉండేమహత్తు. నేటి కొన్ని టాకీ ఫిల్ములు, నాటకాలు మాసి ప్రజలుఅద్దుదిడ్డపు చేష్టలు చేస్తూన్నారని ఓవదంతి. నిజమే నిరూపించటానికి వ్రాయ సాహసంచేరంటే కొన్నికొన్ని అవినీతికరమైన విషయాల్ని ఎత్తుకోవటని ఉంటుంది.

కథావిషయంలోనూ నవీనత్వం ఉండాలి.

నాటక రచనకు ప్రాచీన నియమాల్ని పాటించాలి అనను. ప్రస్తుతం ఓ నాటకం కోసం నిర్మించబడిన హాలూలేదు, హాలుకోసమని వ్రాసిన నాటకమూలేదు. ఇల్లానే నటులకుతగ్గ పాత్రసృష్టిలేదు, పాత్రసృష్టికితగ్గ నటులూలేరు. ఈమూడిరిగాఉంది ఒకదానికొకటి అందకుండాను. నాటకంఅనే పేరుతో పుస్తకాలు బయలుదేరుతున్నాయి, అల్లానే ప్రదర్శనాలు, నటులు ఉంటున్నారు. ఇందుకు ప్రజలంతా చూసి ఆనందించినవారు తెలియనివాళ్ళవా? అని ఓసందేహం కలుగుతుంది పాఠకులకి. నా ఉద్దేశంలో తెలియనివాళ్ళని. కారణం, వారికి రచనలోగాని, నటులతోగాని సంబంధంలేదు. వారు ఏదిస్తే దాన్ని అనుభవించుటమే ప్రజల (పేక్షకుల) పని

కాబట్టి, ప్రస్తుతస్థితినిబట్టి ఉపయోగము, అనుకూలముగా ఉండే నాటకములుఅవసరం. కవి ఎంతసొంపుగా నాటకాన్ని రచించినా సరియైనట్లుగా నటులు పాత్రను పోషించనప్పుడు ఆనాటకంయొక్క ఉపయోగం పెద్దదిగా ని వృధచికిగాదు.

మరోవిషయం ఏమనగా నోరుతిరుగని సంస్కృతపదాలు వాడితేనేగాని కవి.అనరని రచయితలు తలుస్తారు, ఇట్టివారు శ్రీసురవాడవారి కన్యాశుల్కం చదవాలి పాటలు పద్యాలు పాడకపోతే, అవే నా ఇనిషేషనుగా ఉంటేనేగాని నటుడనుటకు వీలులేదన్నట్లుగా నేటి నటుల ఉద్దేశం.

కళాభిమానులు ప్రజల్లోను, నటుల్లోను, రచయితల్లోను అల్లా ఉండే అమాయకత్వాన్ని పోగొట్ట యత్నించి నాట్యకళ విజయాన్ని ప్రదర్శింపజేయుటకు యత్నించాలి. అట్టివారికి ప్రజల సహాకారమూ అవసరమే.

## కాంగ్రెసుఫెడరేషన్‌నుస్వీకరించును

కాంగ్రెసు పరిపాలనను ఇతరులస్వాధీనపరచదు

జాగంధరుగారి స్పష్టాభిప్రాయములు

లాహోరు జనవరి ౨౯

విఖ్యాత రచయిత, పత్రికా విలేఖకుడగు జాగంధరు, ఇఫ్తెఖారొద్దీన్ యొసగిన యొక విందున ఉపన్యసించుచు నేడు ప్రపంచమునందు రెండు ప్రదేశములందు గొప్పయుద్ధములు జరుగుచున్నవి. కాని ప్రపంచయుద్ధము సంభవించుటకింకను కొంతకాలము ఆలస్యముగలదు. అవి మడివిరి. గంధరుగారు తాము జాతీయసమితిని ధృతపరచువారలలో నొకరమనియు, ప్రజాప్రభుత్వ సిద్ధాంతమును బలపరచువారమనియు, రష్యాలో సంపూర్ణ నియంతృత్వ మేర్పడియున్నను అచటి పరిస్థితులుఅభివృద్ధికరముగా నున్నవనియు, ప్రజలు సంతోషకరముగా నున్నారనియు తెలిపిరి.

భారతదేశ రాజకీయసమస్యలను చర్చించుచు నేడు, కాంగ్రెసు ఎన్నికలసమయమున గావించిన వాగ్దానములనుపూరించలేకవని భావించుచున్నది.పదవీస్వీకరణతరువాత ప్రజాసామాన్యమునకు లాభము గావించుటకుభారతశాసన నిర్బంధములవలన వీలులేదని తలచినను, తలపకున్నను నేడు కాంగ్రెసు పరిపాలనమునింకొకరి హస్తములందు స్వాధీనపరచదు. అని గంధరు తెలిపిరి.

"ఫెడరేషన్‌ను ప్రతిఘటించుట అసాధ్యమే యైనను, కాంగ్రెసేగాక భారతసంస్థానాధిపతులు, ముస్లింలీగువంటి సంస్థలు ఫెడరేషన్‌ను ప్రతిఘటించుచున్నను, ఈసమస్యను పరిష్కరించు భారము గాంధీమహాత్మునిపై గలదు. గొప్పసమస్యలన్నియు గాంధీమహాత్ముడే పరిష్కరించుచున్నాడు. మహాత్ముడెప్పుడును రాజకీయ క్లిష్టతలను గలిగింపడు" అని వీరు నుడివిరి.

గంధరుగారు ఉపన్యాసమును ముగించుచు కాంగ్రెసు రాష్ట్రీయ స్వపరిపాలనా విధానమును స్వీకరించినది కావున ఫెడరేషన్‌నుగూడ స్వీకరించునని స్పష్టపరచిరి.

## స్పెయినందు ప్రభుత్వ పునర్నిర్మాణము

హెండే, ఫిబ్ర ౧

ఇదివరకు ౧౫ మంది సభ్యులమంది తాత్కాలికముగా జనరల్ ఫ్రాంకో ప్రభుత్వ మేర్పడియుండెను. కాని ఇప్పుడాపద్ధతిమార్చి క్రొత్త ప్రభుత్వమేర్పరచుటకు నిశ్చయింపబడినది. ఆ నూతనప్రభుత్వమునందు జనరల్ ఫ్రాంకో మాత్రమేగాక ౧౫ మంది అమాత్యులేర్పడెదరు. ఫ్రాంకో సాయుధ సైన్యమునకు సర్వాధికారిగా ఏర్పడెదరు. ఇంతేగాక వీరు ప్రభుత్వాధ్యక్షులుగనో, లేక ప్రధానామాత్యులుగనో ఏర్పడెదరని అనుకోనబడుచున్నది.

## జపానువారి ప్రయత్నమున కడ్డుకలుగుట

షాంఘాయి, ఫిబ్ర ౧

ఇదివరకు జపాను చీనాసైనికులకు ద్వంద్వయుద్ధము జరుగుచుండెను కాని మొన్నటినుండి మంగ్యాయొద్ద జపానువారు సలుపుచున్న తీవ్రప్రయత్నములు చీనావారివలన అరికట్టబడినవి. చీనావారడ్డుపడుటవలన సుమారు ౧౩౦ మంది జపానుసైనికులు హతులైరి. చీనావారికి కొంత నష్టమైనది జపాను యుద్ధనావలు తిరిగి యాంగ్ట్సీనదీప్రవాహమునకు ఎదురు వెళ్లిపోవుచున్నవి.

## నిజాం రాష్ట్రములో భూతత్వ పరిశీలనము

తరీ సేద్యమునకు ఏవి ఉపయోగములో నిర్ణయించు ప్రయత్నములు

హైదరాబాదు ౩౦ జనవరి

ప్రభుత్వ ప్రకటనశాఖవారీ క్రిందివిధముగ తెలుపుచున్నారు:—

మహోన్నతశ్రీవహించిన నిజాంగారి ప్రభుత్వమువారు, అబర్డీన్ విశ్వ విద్యాపీఠమందు భూతత్వ శాస్త్రమును బోధించువారును, అబర్డీనులో భూతత్వ పరిశోధన కొఱకున్న మెకాలేసంస్థ [Macaulay institute for soil research] యొక్క అధిపతియు, ఇండియన్‌సైన్సు కాంగ్రెసుకు పంపబడిన బ్రిటిషు అసోసియేషను ప్రతినిధులలో నొకరునుఅగు డాక్టర్ డబ్ల్యు. జి. అగ్, పి హెచ్. డి గారిని, ఈ రాష్ట్రములోనున్న నానా ప్రకృతులుగల భూములను, పరిశీలించి, అవి, ముఖ్యముగా తలపెట్టబడిన తుంగభద్రా ప్రాజెక్టు క్రిందనుండు రాయచూరుజిల్లాలో నల్లభూములు తరీసేద్యమునకు తగినవిలేనిది చెప్పుటకై హైదరాబాదుకు పిలిపించియుండిరి. డాక్టర్ అగ్ గారు రాయచూరులో ప్రభుత్వమువారి ప్రధాన పరీక్షాక్షేత్రమును (మెయిన్ యక్స్పెరిమెంటల్ ఫారం)చూచి ఆ జిల్లాలో సంచారము చేసి అక్కడనుండు అనేకరకములగు భూములనుచూచిరి. వారు సంగారెడ్డి (మెదకుజిల్లా), రుద్రూరు (నిజామాబాదుజిల్లా)లలో ప్రభుత్వమువారి పరీక్షాక్షేత్రములను, పటంచెరువు గోకల గ్రామోద్ధరణ కేంద్రమునుదర్శించిరి వారు నిజామాబాదు, మెదకు జిల్లాలలో తిరిగి ఆ ప్రాంతములందుండు అనేకరకముల భూములను, అక్కడ నీరుకట్టుటకు వాడుకలోనున్న అనేకపద్ధతులను చూచిరి. హిమాయత్సాగరులో ప్రభుత్వమువారి ప్రధాన పరీక్షాక్షేత్రమును జూచినతర్వాత ౨౧ జనవరి ౧౯౩౮ నాడు ఇంగ్లాండుకుపోయిరి. నల్ల భూములలో తరీసేద్యము చేయు విషయమును గూర్చిన నివేదికను వారు ఇంగ్లాండునుండి పంపుటకు వాగ్దానము చేసినారు, అది సుమారు రెండు నెలలలో రావచ్చును.

## సంవత్సరమునకు ౩౦౪ కోట్ల చాకప్పులు

ఒక సంవత్సరములో ప్రపంచమందంతట అన్ని దేశములలో ౩౦౪ కోట్ల కప్పుల టీ త్రాగబడుచున్నటుల లెఖ్కలవలన దెలియుచున్నది. ప్రపంచమందంతటా వాడబడే టీ ఒక పెద్ద తటాకమువంటి కప్పులోనింపిన ౪౨౪ అంగుళములలోతున ౭౦౦౦ అంగుళముల వెడల్పులో పరిపోవును. ఈప్రవాహము క్వీన్‌మేరీ వార్మండిప్రదేశముల ధ్వంసమునకు పరిపోవునట

## అమెరికాయొక్క నావికా సైన్యము

వాషింగ్టన్, ఫిబ్ర ౧

గత ఆగస్టు ౧౫ తేదీన బ్రౌన్‌సోనుండి షాంఘాయికంపబడిన ౧౫౦౦ నావికాసైన్యము అచ్చట అనవసరమున్నందున, హానూలోలూకు మార్చబడినటుల, ౧౦౦౦ మంది సైనికులుగల రెజిమెంటుమాత్రము షాంఘాయి యందుంచబడినటుల నావికా కార్యాలయమువారు తెలుపుచున్నారు.

## ఆరముదు అయ్యంగారు ఆంధ్రులుకారు

(గోలకొండ విలేఖరి)

హైదరాబాదు: ఫిబ్ర ౨

శ్రీమాన్ ఆరముదయ్యంగారు అవర్‌ఖల్ మొన్న ౩౧ జనవరినాడు రెడ్డిహాస్టల్ పింగిళి జనార్దన్ రెడ్డిగారి వర్ధంతినాడు ఉపన్యసించుచు మొట్టమొదటివాక్యంగా ఆనాటి విషయానికి సంబంధములేకున్నా, బాదరాయణ సంబంధం కల్పించుకొని, ఇట్లు సెలవిచ్చినారు. "నేను ఆంధ్రుడకానని మీరు వినియుందురు. లేదా పత్రికలలో చదివియుందురు. నిజమే నేను ఆంధ్రుడనుకాను. నేను ద్రావిడను. అయినను ఈ ౨౫ ఏండ్లుగా నాకు ఆంధ్రులతో సానుభూతియుంటూ వచ్చినది."

శ్రీమాన్‌గారు సిరిసిల్లా మహాసభకు సందేశము పంపుతూ "తాము ఆంధ్రులు కాకున్నను" ఆంధ్రులయందు సానుభూతికలవారని వ్రాసియుండిరి. ఇదివరలో ఒక సికింద్రాబాదు "ఆంధ్రుడు" శ్రీమాన్ అవర్‌ఖల్ ను ఆంధ్రుడేయని సమర్థించుచు వ్రాసిన వ్యాసమునకిప్పుడేమి జవాబో యేమో?

— తెలంగాణా ఆంధ్రుడు

## క్షామబాధితులకు పన్నులమాఫీ లేదు

(గోలకొండ విలేఖరి)

గద్వాల, ఫిబ్రవరి ౨

ఆబ్కీస్తులో ౨ అణాలు మాఫీ జాగీర్లలో కూడ కావలెనని ఫర్మాను అయినదంటున్నారు. కాని మాసంస్థానములో ఏమిన్ని మాఫీ కాలేదు. ఈసంవత్సరం క్షామం మాసంస్థానములోలేదని ఇక యెవరు చెప్పగలరు. గోలకొండపత్రికలోనే మాతాలూక్దారుగారు ఈ సంవత్సరం క్షామం వచ్చినందువల్ల మాఘమాసం జాతరలో పండితులకు సంభావనలు లేవు అని చాటించారుకదా! రైతులకింతకంటె వేరే సాక్ష్యమెందుకు. పైగా వర్షాభావమువల్ల రబ్బీపంటలంతా యెండిపోయినవి. ౨ అణాల పంటకంటె యెక్కువ రైతులకు పండలేదు.

## ఇటలీఆయుధఉత్పత్తిశాల ప్రేలుట

౧౦౦గురు మరణించిరి. ౧౦౦౦ మంది గాయపడిరి.

రోం, జన.౨౯

ప్రపంచయుద్ధముతరువాత నేడు సగినీ ఆయుధ యుత్పత్తిశాలయందు కలిగిన ప్రేలుడంత ప్రేలుడెప్పుడును సంభవించలేదు. ఈప్రమాదమువలన నూరుగురికంటె యెక్కువ పారిశ్రామికులు మరణించిరనియు, వేయిమంది కంటె యెక్కువపారిశ్రామికులు గాయపడిరనియు వైద్యులుఅంచనా వేయుచున్నారు. వైద్యశాలలన్నియు గాయపడినవారిచే నిండియున్నవి.

ప్రమాదస్థలమునుండి చుట్టు ఐదుమైళ్లవరకు గల ప్రదేశములు సైనికశాఖవారాక్రమించుకొనియున్నారు. మరికొన్ని ప్రమాదములు సంభవించునేమోయను భయముకలుగుటచే ఈప్రదేశమునందు మానవసంచారము నిషేధింపబడినది.

ఇటలీచక్రవర్తి ఎమ్మాన్యుయల్ ప్రమాదస్థలమును పరిశీలించుటకై విచ్చేయగా ప్రమాదభయముచే కమాండింగు ఆఫీసరువారిని నిరోధించెను.

ఇప్పటివరకు కొంతమంది పారిశ్రామికులు మాత్రమే బయటికి తీయబడినారు. వీరినిఅంబులెన్సుకారులు వైద్యశాలకు చేర్చుచున్నవి. సాయంత్రమునకు ప్రమాదమునకు గురియైనవారినందరిని వైద్యశాలయందు చేర్చవలయునని సైనికాధికారులు విపరీతకృషిని గావించుచున్నారు.

తన అన్నకూతురి వివాహమునకేగిన ముసోలినీగారు ఈవార్త తెలిసినవెంటనే ప్రమాదస్థలమునకేతెంచిరి సహాయకార్యక్రమము వీరి పర్యవేక్షణ క్రింద జరుపబడుచున్నది.

## భారత దేశ పునర్దర్శనాభిలాషతో

## లోధియన్ ప్రభువు నిష్క్రమణము

గుడిసెలో గడపు జీవితము ఆనందదాయకమైనది

## "భావిరాజప్రతినిధిని నేనుగాను"

—లోధియన్

కరాచీ జనవరి ౨౯.

"భారత దేశమును వదలుచున్నందులకు నేనెంతయో వగచుచున్నాను. వారియెడ సానుభూతి, సహాయమును చూపిన మిత్రులందరికి కృతజ్ఞత." అను సందేశమును పత్రికా ప్రతినిధుల కొసగుచు నేడు ఉదయము లోధియన్ ప్రభువు ఇంగ్లాండుకు విమానముద్వారా బయలుదేరిరి.

భారతదేశమునందు నేను గడపిన ఎనిమిది వారములు సంతోషప్రదముగా నుండెను. నాకు సంభాషణను సదవకాశమునొసగి తమఅమూల్యాభిప్రాయములను ప్రకటించిన మిత్రులందరికిని వందనములు. నేను ప్రత్యేకముగా గాంధీమహాత్ముని సందర్శనమునకుఅత్యంతము చెందితిని. గుడిసెలోగడపు జీవితమువలనగలుగు ఆనందము ఇంకెచటను లభించదు. ఈ జీవితము నా స్మృతిపథమునందు సదా విహరించుచుండును." అని లోధియన్ గారు నుడివిరి.

పత్రికా ప్రతినిధులు లోధియన్ ప్రభువుగారిని వారుభావిరాజ ప్రతినిధులుగా నియమింపబడుదురనువార్త విశ్వసనీయమేనా? యని ప్రశ్నించగా "అసత్యమని" ఖంటాపథముగా నుడివిరి.

అధునిక అభివృద్ధిని గమనించుచు భారతదేశమునకు అధినివేశ పరిపాలనాధికార మెప్పుడు సిద్ధించునని ప్రశ్నింపగా వారు తాము అవతారపురుషులము గామనియు, తమవంటివారు చెప్పుటకొక్క మెప్పుడోయొకప్పుడు మాత్రమే ఘటించు మనునియు ప్రత్యుత్తర మొసగిరి.

లోధియన్ ప్రభువుగారు భారత వార్తాపత్రికల సర్వతోభివృద్ధిని ప్రస్తుతించుచు, ప్రస్తుతము వారిట్టి కార్యక్రమము స్థిరపరచుకొనకున్నను, భారతదేశ పునర్దర్శనాభిలాష గాఢముగా గలదని నుడివిరి.

పత్రికా ప్రతినిధులను పండిత జవాహర్లాలు నెహ్రూ, సుభాషుచంద్రబోసు గారల కార్యక్రమమును, హరిపురము కాంగ్రెసు వృత్తాంతములనుగూర్చి లోధియన్ ప్రభువుగారు అనేక ప్రశ్నలను పృచ్ఛించిరి.

## అమీనకచేరీలో నిందితుని మరణము

వరంగలుజిల్లా న్యాయాధికారి విచారణ

(గోలకొండవిలేఖరి)

వరంగలు: ఫిబ్రవరి ౧

ఈజిల్లాలోని బండారుపల్లె గ్రామవాసియగు బానాల వీరయ్య ద్రవ్యాపహరణ నిందాకోపితుడై గతవారమున జిల్లా పోలీసువారిచే అరెస్టుచేయబడి ములుగుకు తీసికొనిపోబడెను. అచట మరుసటి దినము అమీనాకచేరీలో నిందితుడగు బానాల వీరయ్య ఆకస్మాత్తుగా మరణించెను.

అమీనాకచేరీలో నిందితుడు మరణించిన వార్త తెలియగనే జిల్లాపోలీసు మొహతెమీం గారు జిల్లా న్యాయాధికారిగారు ములుగుకు వెడలి మరణ కారణముల నారసి, శవపరీక్షను గావించుటకై ములుగు డాక్టరుగారి కాజ్ఞనొసగిరి.

నిందితుని మరణకారణ మింకను తెలియుట లేదు.

నేను సాయంత్రము ప్రకటింపబడిన ఇటలీ వార్తా పత్రికయందు ఈప్రమాదవార్త కట్టి పాణ్ని ముఖ్యస్థానమున ఒసగబడలేదు. నేడు సాయంత్రము ప్రకటితమైన ప్రభుత్వప్రకటన మాత్రము పత్రికయందు ప్రకటింపబడినది.

## వయోజనవిద్యకై ప్రభుత్వనిశ్చయము

బొంబాయి: జన ౩౦

వయోజన విద్యావిషయమున బొంబాయి ప్రభుత్వమువారు డాక్టరు క్లిఫర్డు మన్షర్డ్ ఎం. ఏ. పిహెచ్. డి గారి అధ్యక్షతక్రింద యేర్పరుపబడిన సలహాసంఘమువారు ప్రభుత్వమువారికి సలహానొసగుట కీవిషయమును గురించి క్రింది విచారణీయాంశముల నిర్ణయించిరి:—

౧. విద్యాస్థితి అత్యల్పముగా గల కొర్వదనము కంటె దేశములో సామాన్యవిద్యాపద్ధతియందు వయోజనవిద్యకేస్థాన మేర్పడవలయును?

౨. వయోజన విద్యావిషయిక వివిధమార్గములు విశదీకరించుడు. ఈ వివిధమార్గముల ప్రోత్సహించుటకు ప్రభుత్వమువారి కర్తవ్యమేమి?

౩. గిర్నిలు, ఫ్యాక్టరీలలో కార్మికులకు వినోదము దేర్పరచువారు తమ కూలిజనములో విద్యాప్రచారమునై ప్రభుత్వమువారికెటుల సాయపడెదరు? ముంబాయి (పూనా) లేబరు మిల్సువారు తమ కార్మికులలో వయోజనవిద్యాప్రచారమున కవలంబించిన మార్గములు బొంబాయి, అహమదాబాదు, షోలాపూర్ మొదలగు ప్రదేశముల మిల్లుల వ్యవస్థాపకులు, వైశ్యకర్మాగార వ్యవస్థాపకులకు వయోజనవిద్యకై లాభకారి కాగలవా?

౪. వయోజన విద్యావ్యాపకమునకు, పరిశీలనమునకు సంస్థలు, వయోజన విద్యా విషయమునందు పాఠశాలబోర్డుల, విద్యాపరివారకుల సేవ లెంతవరకు ప్రభుత్వమున కుపకరించ గలవు?

౫. వయోజనపాఠశాలలకు పాఠ్యగ్రంథములు, సారస్వతకవి, "చేయుచున్నట్లే చేయు" కార్యములకు లభించగలవా? లభ్యమైన అట్టి గ్రంథముల పట్టికలెవ్వి? లభించకున్న నెటుల వీలగునో కమిటీవారు సూచింప వలయును.

౬. వయోజనులకు గ్రామగ్రంథాలయములు, వాని నిర్మాణము, పోషణ, ఆర్థికసౌకర్యము.

౭. వయోజనవిద్యయందు యుక్తిదీపము, సినిమా, రేడియోలకు గల స్థానము.

ఈవిషయ మవలంబించుటకు యిప్పటికున్న విద్య బోధన శాఖనెటుల పునర్నిర్మాణ మొనర్పవలయును?

౮. స్త్రీవయోజనవిద్య, పద్ధతి, సంస్థ.

౯ వయోజనవిద్యకు గ్రాంట్సు— ఇన్-ఏడ్ అధారములు కలుగుటకు సూచింప వలయును.

౧౦. విద్యాసంపాదిత సర్టిఫికెట్లు —

౧౧ కమిటీ · రు తమ మొదటి సమావేశమునుండి రెండుమాసములలోగా నివేదిక సిద్ధపరచి అందజేయుటకు ప్రభుత్వము కోరుచున్నది.

## గనులపనివారలలో ౯ రు మరణించిరి

లండన్, ఫిబ్ర ౧

కెల్సర్, ష్రర్లింగ్ షైరు బొగ్గుగనులలో విస్ఫోటముకారణముచే ౯ రు మరణించిరి.

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad, Editor K Balakrishna Reddy